# "తోడు దొంగలు"

నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారి ప్రథమ సాంఘిక చిత్రం "తోడుదొంగలు" ఈ 15 వ తేదీన విడుదలయింది. 12 వ తేదీన వాహినీ స్టూడియోలో పత్రికావిలేఖరులకు ప్రివ్యూ యిచ్చారు. (చిత్రం విడుదలకాక ముందు పత్రికలవారికి చూపించడం ఇటీవల పలువురు మానుకున్నారు)

"తోడుదొంగలు" దర్శకుడు యోగానంద్. రచన: సముద్రాల జూనియర్. సంగీతం: టి. వి. రాజు. కెమెరా: రహమాన్. ఎన్. టి. రామారావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, చలం, మద్దాలి కృష్ణమూర్తి, డా॥ శివరామకృష్ణయ్య, ఘంపతి కౌశయ్య, టి. జి. కమలాదేవి, హేమలత మున్నగువారు నటించారు.

తోడుదొంగలిద్దరిలో ఒకరు అన్నపూర్ణా రైస్ మిల్లు ప్రొప్రయిటరు లోకనాథం (గుమ్మడి) ఇంకొకరు మేనేజరు పరమేశం (ఎన్. టి.). వీరిద్దరూ కలిసి మిల్లు కార్మికులపట్ల అమానుషంగా ప్రవర్తించి డబ్బు మూట కట్టుకుంటూ ఉంటారు. వీరి దోపిడీకి గురి అయిన ఒక కార్మికుడు రాముడు. ఇతడు జబ్బుపడి లేచి నీరసస్థితిలోనే పనిలోకి వస్తాడు అతడు రోజంతా పస్తుండి పనిచేసినా, పరమేశం కూలీయిచ్చి పంపించడు. అతణ్ణి మిల్లుపైకప్పు ఎక్కించి పాడైపోయిన బల్బుతీసి కొత్తబల్బు వెయ్యమని పురమాయిస్తాడు. రాముడికి షాక్ తగిలి అమాంతం కిందపడి మరణిస్తాడు. అతడి కుటుంబానికి నష్టపరిహారం ఇవ్వవలసి వస్తుందని లోభించి పరమేశం, లోకనాథం కలిసి అతడి శవం కారులో వేసుకెళ్ళి ఊరవతల కొండపక్కన వేసేస్తారు. అతడు ఆత్మహత్య చేసుకున్నాడని పోలీసులు భావిస్తారు రాముడి భార్యా, ముగ్గురు పిల్లలూ దిక్కులేని వాళ్ళవుతారు వారికి లోకనాథం ఒక్క దమ్మిడీకూడా సహాయం చెయ్యడు.

కాని ఆ రాత్రినుంచే పరమేశానికి అంతస్సంఘర్షణ ప్రారంభమవుతుంది. కన్నుమూసినా, తెరిచినా షాక్ తగిలి గిలగిల కొట్టుకుంటున్న రాముడే ప్రత్యక్షమవుతాడు. మనశ్శాంతి చెడిపోవడంతో పరమేశం ఆరోగ్యంకూడా చెడిపోతుంది డాక్టర్నడిగితే నెలరోజులకంటె ఎక్కువ బతకవంటాడు. సిద్ధాంతి నడిగితే అతడూ లెక్కలు గుణించి అదేమాట చెబుతాడు. నిజంగా నెలరోజుల్లో చావు తప్పదని నిశ్చయించుకుంటాడు పరమేశం. మిల్లులో తను కూడా చిన్న భాగస్వామి కనుక తనకు రావలసిన పైకం పదివేలదాకా తీసేసుకుని, ఇంటి వ్యవహారాలన్నీ చక్కపరిచి, భార్యకీ కొడుక్కీ 6 వేలు వదిలిపెట్టి, నాలుగు వేలు తను తీసుకుని మద్రాసు వెళ్ళిపోతాడు. మద్రాసులో ఆ నెలరోజులూ జల్సాగా గడపాలని అతని ఊహ.

మద్రాసు వెళ్ళినా అతన్ని రాముడు వదిలిపెట్టడు. కల్లో నరకయాతన అనుభవిస్తాడు. మేలుకున్నప్పుడు, తినే అన్నంలోనూ, త్రాగే నీళ్ళలోనూ రాముడే కనిపించి అతనికి మనశ్శాంతి లేకుండా చేస్తాడు. ఒకరోజున రోడ్డులో మూర్ఛపోతాడు అతణ్ణి ఒక ఫ్యాక్టరీ కార్మికుడు ఇంటికి తీసుకుపోయి ఆదరిస్తాడు. పరమేశం అతడి ఆదరణకు విస్తుపోతాడు. ఆ కార్మికుడు పనిచేసే ఫ్యాక్టరీ ఆదర్శవంతమైన పద్ధతుల్లో నడుస్తూంటుంది మేనేజరు మంచివాడు. కార్మికులకు శుభ్రమైన నివాసగృహాలు కట్టించాడు. వారి కష్టసుఖాల్లో పాల్గొని కన్నబిడ్డల్లా చూసుకుంటూ ఉంటాడు. ఇదంతా చూసి పరమేశం దానికీ తన ప్రవర్తనకీ గల వ్యత్యాసం గ్రహించి, తన తప్పులకు పశ్చాత్తాపపడతాడు. తన కథ, తను చేసిన అన్యాయాలూ ఆ కార్మికుడితో చెప్పేస్తాడు ఆ కార్మికుడు "నీకు మనశ్శాంతి కలగాలంటే ఒకటే మార్గం ఉంది నువ్వు ద్రోహం చేసిన రాముడి కుటుంబానికి వెంటనే సహాయం చెయ్యి" అని సలహా ఇస్తాడు పరమేశానికి ఈ సలహా నచ్చుతుంది తన మరణదినం ఆసన్నమైంది కనక వెంటనే రైలెక్కి స్వగ్రామం చేరుకుంటాడు. ఈలోగానే అతనివద్ద మిగిలిన రెండువేలూ తస్కరించబడుతుంది. ఇంటికి వెళ్ళి భార్యకిచ్చిన 6 వేలలో కొంత డబ్బు తీసుకుని అది రాముడి కుటుంబానికివ్వాలనుకుంటాడు. కాని ఆ డబ్బంతా అప్పటికే అతని కొడుకు చేతిలో పడి హారతికర్పూరంలాగ హరించిపోతుంది. చేసేది లేక తన తోడుదొంగ అయిన లోకనాథందగ్గిరికివెళ్ళి రాముడికి చేసిన ద్రోహానికిగాను అతడి కుటుంబానికి రెండువేల రూపాయలు సహాయం చేద్దామంటాడు. లోకనాథం ఒప్పుకోడు. కాని తామిద్దరూ కలిసి రాముడి శవాన్ని ఊరవతల పారేసిన సంగతి పోలీసులకు రిపోర్టు చేస్తానని పరమేశం బెదిరించే సరికి లోకనాథం లొంగిపోయి రెండువేలూ ఇస్తాడు. పరమేశం రాముడి భార్యకు ఆ డబ్బిచ్చేస్తాడు జీవితంలో ఒక్కసారైనా మంచిపని చేశానన్న సంతృప్తి అతనికి కలిగి నిర్వికారంగా మరణానికి సిద్ధపడతాడు. డాక్టరూ, సిద్ధాంతీ చెప్పిన ప్రకారం ఆరాత్రే అతడు చనిపోవలసిన సమయం. సర్వసన్నాహాలూ పూర్తిచేసుకుని మంచంమీద పడుకుంటాడు ఆ పడుకోవడం పడుకోవడం మూడోరోజున నిద్రలేస్తాడు. ఈలోగా అతనికి మనశ్శాంతి లభించినదానికి సూచనగా స్వప్నంలో స్వర్గసుఖాలు చవిచూస్తాడు

మరణగండం దాటిపోయినందుకు సంతోషించి, తిరిగి మిల్లులో పనిచేయడానికిగాను లోకనాథం దగ్గిరికి వెడతాడు. పరమేశం ఇకమీద కూలీలపక్షం వహిస్తాడని అనుమానపడిన లోకనాథం అతన్ని చేర్చుకోడానికి నిరాకరిస్తాడు కాని కార్మికులు పరమేశాన్ని మేనేజరుగా నియమించకపోతే మేము పనిచెయ్యమని కట్టుకడతారు. విధిలేక లోకనాథం పరమేశాన్ని అంగీకరిస్తాడు. అతడు నూతన దృక్పథంతో మిల్లును నడిపించడానికి పూనుకుంటాడు.



"తోడుదొంగలు"లో పరమేశంగా ఎన్. టి. రామారావు.

# తెలుగునిర్మాతలకు వినోదపాఠాలునేర్పే చిత్రం

# (To-morrow is too late)

అత్యంతాహ్లాదకరమైన ఇటాలియన్ చిత్రం "టుమారో ఈజ్ టూ లేట్" ఇవేళల మద్రాసు వచ్చింది. "మంచి పిక్చరు ఒకటి వచ్చింది. నేను రెండోసారి వెడుతున్నాను. మీరు కూడా రండి. ఇవాళే ఆఖరిరోజు *To-morrow is too late*" అని మిత్రు లొకరు అన్నారు. వెళ్లాను, చూశాను, ఆనందించాను. ఒకసారి కాదు, మూడుసార్లు వరసగా చూసినా మొదటిసారి పొందినంత ఆనందమూ పొందవచ్చు ననిపించింది. "ఎంటర్ టెయిన్ మెంట్" అనే బీజాక్షరాలు రాత్రింబగళ్లు జపించే మన నిర్మాతలు, దర్శకులు, తారలు ఈ చిత్రం చూసి ఆ బీజాక్షరాల అసలు అర్థం తెలుసుకోవలసి ఉంది. సాధారణంగా మంచి చిత్రం మద్రాసు వస్తే మన సినిమా ప్రముఖులు తప్పకుండా చూస్తారు చూసి వెంటనే మరిచిపోతారని నా నమ్మకం. ఒకవేళ తమ చిత్రాల్లోకి యథాతథంగా దిగుమతి చేయదగిన విషయాలు జ్ఞాపకముంచుకుంటారేమో తెలియదు. ఏమైనా ఈ చిత్రం, ముఖ్యంగా వాసన్ గారివంటి నిర్మాతలు చూసినట్లయితే, "ఎంటర్ టెయిన్ మెంట్"కి "ఎన్ లైటెన్ మెంట్"కి విరోధం ఉందనే మాట మళ్ళీ అనరనుకుంటాను. వినోదం ఉంటే విజ్ఞానం ఉండదనీ, ఇది ఉంటే అది ఉండదనీ గదా వాసన్ గారి వాదన! ఈ ఇటాలియన్ చిత్రం ఆ రెంటికీ అవినాభావసంబంధాన్ని సాధించేదే కళ అని ఋజువు చేస్తుంది.

ఎందుకంటే, ఈ చిత్రంలో కావలసినంత వినోద విజ్ఞానాలున్నాయి విద్యావంతులైనవా రందరినీ బాధించే ఒక గడ్డు సమస్య ఈ చిత్రం చూపించింది. బాల్యం పూర్తిగా వదలకుండా, యౌవనం పూర్తిగా రాకుండా మధ్యదశలో ఉండే బాలబాలికలను ఎదుర్కొనే సెక్సు సమస్యను ఆధారం చేసుకుని చిత్రం తీయబడింది హైస్కూళ్లలో చదువుకునే విద్యార్థులు, విద్యార్థినులు, ఈ ఉభయవర్గాలమధ్య ఆకర్షణ, సంఘర్షణ, సెక్సునుగూర్చి వారికిగల పట్టరాని కుతూహలం, అంతులేని అజ్ఞానం, ఆడపిల్లలకేసి ఆకర్షించబడే మగపిల్లల్ని, మగపిల్లలకేసి ఆకర్షించబడే ఆడపిల్లల్ని ఏం చెయ్యాల్లో తెలియక తికమకపడే తల్లి తండ్రులు, టీచర్ల ప్రవర్తన ఎంతో సహజంగా చూపబడ్డాయి. సెక్సు సమస్య అనేక కోణాలనుంచి – అయిదారేళ్ళ పిల్లల దృక్పథంనుంచి, తలిదండ్రుల, టీచర్ల దృక్పథంనుంచి, పదిహేనేళ్ల పిల్లల దృక్పథంనుంచి పరిశీలించబడింది. ప్రస్తుతం హైస్కూళ్లలోను, కాలేజీల్లోను వ్యాపించిన వాతావరణం చూస్తూ ఉన్న వారికి ఈ సమస్య ఎంత ప్రాణగొడ్డమైనదో తప్పక స్ఫురిస్తుంది ఈ చిత్రంలోని కథ యథాతథంగా ఆంధ్రదేశానికి కూడా వర్తిస్తుంది ఎవరైనా ఉత్సాహవంతులైన డిస్ట్రిబ్యూటర్లు ఈ చిత్రాన్ని కొనేసి తెలుగులోకి డబ్ చేయించి తేలిగ్గా డబ్బు చేసుకోవచ్చు.

ఈ చిత్రంలో ఒకస్కూలు ఉంటుంది. అందులో ఆడపిల్లలు వేరే, మగపిల్లలు వేరే చదువుకుంటూ ఉంటారు. ఉభయవర్గాలను సాధ్యమైనంత దూరంగా ఉంచాలని హెడ్ మాస్టరు, హెడ్ మిస్ట్రెసుల ప్రయత్నం. ఈ ప్రయత్నం ఎంత ఎక్కువైతే, అంతఎక్కువగా విద్యార్థులు, విద్యార్థినులు దగ్గరగా రావాలని ప్రయత్నిస్తారు. మగపిల్లలు ఆడపిల్లలవెంటబడి నానాగోలా చేస్తారు; క్రమశిక్షణారహితంగా ప్రవర్తిస్తారు; ప్రేమలేఖలు రాస్తారు; ఆడపిల్లలు కూడా మగపిల్లల్ని అస్తమానం తలుచుకుని గుటకలు మింగుతూంటారు. ఉభయులూ సెక్సుపత్రికలూ, సెక్సు సినిమాలు అలవాటు చేసుకుంటారు. వారిలో ఆ వయస్సులో సహజంగా బయల్దేరే సెక్సు వికారాలను సానుభూతితో అర్థం చేసుకుని సవ్యమార్గాన పరిష్కరిద్దామని ఉపాధ్యాయులు ప్రయత్నించరు సెక్సు అనేదాన్ని భయంకర భూతంగా పరిగణించి, దాన్నుంచి పిల్లల్ని దూరంగా ఉంచడానికి చూస్తారు. ఇంటి దగ్గిర తలిదండ్రులూ అంతే. మిర్రెలో అనే పిల్ల ఉంటుంది. ఆమె తల్లీ, తండ్రీ మరీ కఠినంగా, అమానుషంగా ప్రవర్తించి, ఆమెను మగపురుగు కంటపడకుండా చెయ్యజూస్తారు. ఫ్రాంకో అనే కుర్రాడుంటాడు. అతని తలిదండ్రులు అతని వికారాలు గమనించి, ఏదో చెయ్యకపోతే లాభం లేదనుకుంటారు. తండ్రి అతణ్ణి చాటుకి పిలిచి, సెక్సునుగూర్చి నిష్కర్షగా, దాపరికం లేకుండా బోధించ దలుచుకుంటాడు. కాని కొడుకు దగ్గిర సెక్సును గూర్చి మాట్లాడ వచ్చేటప్పటికి నోట్లోంచి మాటరాక, నీళ్ళునమిలి 'ఏం లేదులే' పొమ్మంటాడు.

ఈ సమస్యకు పరిష్కార మార్గం నిర్భయంగా సూచించిన వ్యక్తి ఒక ఉపాధ్యాయిని. పిల్లలను సెక్సు విజ్ఞానానికి

## "తోడు దొంగలు"

కొత్తరకం కథను చిత్రించడానికి నిర్మాతలు తలపెట్టినట్లుతోస్తుంది పూర్తిగా ఎన్. టి. రామారావు చుట్టూరా మాత్రమే ఈ కథ తిరుగుతుంది. మచ్చుకైనా స్త్రీ పాత్రను ప్రవేశ పెట్టకుండా, ప్రవేశపెట్టనందువల్ల లోటు కనిపించకుండా చిత్రం తీసిన నిర్మాతలు అభినందనీయులు జూనియర్ సముద్రాల సంభాషణలు బాగున్నాయి.

పరమేశానికి ప్రత్యేకంగా రాముడి మీదనే కారణంలేని పగవున్నట్లు కనబడుతుంది. మిగతా కార్మికు లెవర్నీ అతడు గాని, లోకనాథంగాని హింసించినట్లు లేదు. కార్మికులకుగూడా తమ యజమానులమీద అసంతృప్తి లేనట్లే ఉంది. అసలు, రాముడికితప్ప మిగతావాళ్లెవరికీ ఏబాధా ఉన్నట్లు చూపలేదు.

పరమేశంలో పరివర్తన తీసుకురావడం కోసం మద్రాసులో యుటోపియన్ ఫ్యాక్టరీ ఒకదాన్ని కల్పించారు అదర్శమూ, అభూత కల్పితమూ అయిన ఈ ఫ్యాక్టరీమూలంగా చిత్రంచూసే ఏ కార్మిక ప్రేక్షకుడికీ ఆత్మవిశ్వాసము కలుగుతుందనేందుకు ఆస్కారంలేదు. పరమేశానికి తనుపడే అంతస్సంఘర్షణమూలాన హృదయపరివర్తన కలిగే అవకాశం ఎలాగూ ఉండనే ఉంది. దానికోసం 'యుటోపియా' ను కల్పించనక్కర్లేదు. ★